# పీఠిక

శ్రీ

కవిశిరోమణులారా!!

కం॥ పొత్తము రచింప నాకిది
క్రొత్తయగుటఁ దప్పులుండుఁ • గొఱలుఁ గాసన్
జిత్తమునఁ గోపముంచక
నిత్తరి నాదోషములఁ క్ష • మింపుడు దయతోన్॥

ది 10-6-13.
పెదకూత్తేవి.

ఇట్లు విన్నవించు సుధీవిధేయురాలు,
లింగమనేని నాగభూషమాంబ.

శ్రీ

కృష్ణపరబ్రహ్మణేనమః



# మానసబోధతారావళి



## కందములు.

శ్రీధరుఁ డరవిందాక్షుఁడు
సాధుజనావనుఁడుఁ దలఁప • సకలంబునకున్
ఆధారభూతుఁడయిన గ
దాధరు ననయంబుభక్తిఁ • దలఁచుము మనసా॥ 1

భక్తవరదుఁ డను పేరిట
రక్తిమహిన్ జెలఁగు నింది • రా రమణుని నా
శక్తి మెయిన్ బ్రార్థించిన
ముక్తినిఁబొందెదవు సుకర • ముగ నో మనసా॥ 2

కామాద్యరిషడ్వర్గము
చే మహిలో బాధపడుచుఁ • జెల్లరె, జనుల౯
వేమారు నెత్తి నేటికి?
దామోదరుఁ గొలువు మింక • తడయక మనసా॥ 3

ఎప్పటికైనను జీవము
దప్పక నీబొందివిడిచి • తరలుట నిక్కం
బిప్పలుకుఁ దెలిసినిత్యము
నప్పరమాత్ముని భజింపు • మనువుగ మనసా॥ 4

సిరు లమితముగాఁగలవని
గరువము నొందకుము వల్ల • కాటికిఁ జనుచో
నరుదెంచునె? మన యీసిరు
లరయ సుకృతదుష్కృతము లెంటయగును మనసా॥

యాగంబు లొనర్చిన, హాట
యోగంబు లొనర్చిన౯ బ్ర • యోజనమున్నే?
భోగిశయానుని పదముల
బాగుగ నీయందుఁగుదురు • పరపక మనసా॥ 6

సారవిహీనంబగు నం
సారాంభోనిధి మునింగి • సతము సణుగుల౯

ధారుణిఁ బొందగ నేటికిఁ?
సారెకు శ్రీరమణుసేవ • సలుపుము మనసా॥ 7

దేహమునఁ గల్గుభ్రాంతిచె
మోహమదాదులను విడక • మూఢత నెపుడే
ద్రోహమునన్ దగలకుము సు
మా, హరిపదచింతనమున • నలరుము మనసా॥ 8

మనవిని విని యనవరతం
బును నిశ్చలతన్ వహించి • మురదైత్యునిఁ ద్రుం
చిన మేటిఁ గొల్పుటయె సా
ధనమపవర్గమున కనుచుఁ • దలఁపవె మనసా॥ 9

వేగిని లేచినది మొదలు
నోగిది బాగిది యటంచు • నుల్లము నందుం
బాగుగఁ బరిశీలింపుచు
నాగోవిందునిభజింపు • మర్మిలిమనసా॥ 10

అర్మిలిభక్తుల కిల్బిష
కర్మవిమోచనమొనర్పు • కంజదళాక్షున్
నిర్మలతఁ జేరు టుత్తమ
ధర్మమగుట మెలఁగు మటులఁ • దప్పక మనసా॥ 11

వగనైన భీతినైనను
బగనైన మఱొట్టులైనఁ • బల్కినఁజాలున్
ఖగవాహనాథ్యునామము
సుగతినిఁ బొందంగఁజేయు • సులువుగ మనసా॥ 12

కలిమియు లేమియు రెండును
నిలఁ గావడికుండలనుచు • నెఱిఁగి సిరులతోఁ
దులతూఁగునపుడు నలరుచు
నలలేమినిఁ బొందునప్పు • డఱవకు మనసా। 13

నమ్మికొలుచు భక్తజన భ
వమ్ము లవమ్ముగనొనర్చి • వరము లొసగెదం
చిమ్మహి బిరుదునహించిన
యమ్మధుసూదనునిఁగొల్వు•మనయము మనసా॥14

గుర్వగునధికారము నా
కుర్విఁగల్గినదటంచు • నొకతరినైనన్
గర్వమున విఱ్ఱవీగక
సర్వపముని చింతనంబె • సలుపుము మనసా। 15

చోరులయినఁ జారులయిన
వారిజసంభవ భవాది • భర్హిర్ముఖులే

ధీరునిఁ గొల్చెదరా ల
క్ష్మీరమణుని నమ్మికొల్వ • మేలగు మనసా। 16

కరిరాజవరప్రదు సన
వరతము భజియింతువేని • బహుదుస్తరమౌ
పరమార్థము సులభమ్మగ
దొరకును, దుఃఖంబు లెల్ల • దొలఁగును మనసా। 17

సూచినిమోపుటకు నరసి
చూచిన రవ్వంతయేనిఁ • జోటులనువర్కన్
దోచు పరిపూర్ణుఁడై యుపఁ
డా చక్రి భజించిపొందు • మమలత మనసా। 18

జన్మములన్నిట నుత్తమ
జన్మము నరజన్మమగుటఁ • జక్కఁగ హరిన్
జన్మమున భజించిన నిఁక
జన్మమునెత్తఁ బని లేదు • జగతిని మనసా। 19

కొందరు మెండుగ సుఖముల
నొందుకొఱన్ జక్రిమఱచి • యురుదుఃఖములన్
బొందుదురిఁ దలఁతు రటుచే
యుండగ నెపుడతనిఁ దలఁప • న్యాయము మనసా। 20

నారాయణు పదపద్మము
లారాధించిన నఘంబు • లంటవు వారిన్
వారిని సారసపత్రము
లారయ నంటనివిధమున • నవనిన్ మనసా॥ 21

జీవము దేహమును విడిచి
పోవుతఱిన్ సర్వలోక • పూజితుఁ జక్రిన్
భావింతువొ, భావింపవొ
కావున నిపుడే తలంచు • కదలక మనసా॥ 22

పుట్టు తెవుళ్లనుఁ బాపెడు
దిట్టయనుచుఁ బేరునొంది • స్థిరభక్తులచే
పట్టెడు నందునిముద్దుల
పట్టినెపుడుఁ గొలువు మదియె • భద్రము మనసా॥ 23

జీవము గల్గగనే వను
దేవకుమారుని భజించి • స్థిరపదవిఁ గనం
గావలె, నయ్యది బాసిన
యావలఁ దత్పదవిఁ గనఁగ • నౌనే? మనసా॥ 24

దుష్టుల శిక్షయొనర్చుచు
శిష్టులఁ బాలనమొనర్చు • సీతానాథున్

దిష్టాంతమునందయినన్
దిష్టవశంబునఁ దలఁచిన ♦ దివిఁగ... 25




ఎక్కడి తలిదండ్రులో, మఱి
యెక్కడిబాంధవులో, హితులో ♦ యెక్కడిసుతులో,
యెక్కడి ధనధాన్యములో,
యక్కట యివియెల్లకల్ల ♦ యనుకొను మనసా॥ 26

ధరణిన్ గల్గు చతుర్విధ
పురుషార్థములందు నరయ ♦ మోక్షమొకటియే
పరమోత్తమంబగుట నన
వరతంబును దానిఁగోర ♦ వలయును మనసా॥ 27

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

కం॥ పదియున్ దొమ్మిదివందల
పదమూఁడవసమను జూను ♦ పదియవ తేదిన్
గొదలేక ముగించి కరివ
రదునకు నర్పించితిన్ గ ♦ రంబనురక్తిన్॥

## మంగళహారతి.

"మంగళహారతి । మారశుభాంగా" అనుమాదిరిమట్టు

మంగళహారతి । రంగుగఁగొనుమా॥ పల్లవి॥

1. మురళతాభరణా । సరసిజచరణా ।
సురరిపుహరణా । ధరాధరోద్ధరణా॥ మం॥
2. దశరథబాలా । దశముఖకాలా ।
కాంచనచేలా । కామినీలోలా॥ మం॥
3. గోపకుమారా । ప్రాప్తునీవేరా ।
పాపవిదూరా । పావనాకారా॥ మం॥
4. మురహరబ్రోవా । వరగుణరావా ।
నాగభూషమాంబ । నమ్మినదేవా॥ మం॥

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

మద్గురువర్యుండగు శ్రీ ఘంటశాల వేంకటరమణ
కవిప్రణీతంబులు.

### మేలుకొలుపు - భూపాలరాగం.

తెల్లవారవచ్చెను॥ పల్లవి॥

తెల్లవారవచ్చె। నల్లనల్లనపత్తు। తెల్లలేదికూయ
సాగెను। ఉల్లాసమునభక్తు। లెల్లవచ్చిరి గొల్వ।
నల్లనినాసామి మేలుకో॥ తెల్ల॥ ఉపపల్లవి॥

చరణములు

1. కలిగెమోదముకమల। ములకెల్ల నస్తాద్రి। ని
లచె శశిమండలము। కలువల కెల్లది। గులుగగ్గె
వెన్నెల। పులుగులు భయమందె మేలుకో॥ తెల్ల॥

2. చుక్క లంబరమున। నక్కడక్కడ దోఁచె।
మక్కె శుక్రుని తేజము। కొక్కొరొకోయని।
కుక్కుటవ్రాతము। లొక్కటఁగూసెను మేలు
కో॥ తెల్ల॥

3. మచ్ఛమై మున్నీరు। జొచ్చి సోమకుఁద్రుంచి।
చెచ్చెరఁ దొలిమిన్కులఁ। దెచ్చిపద్మజునకు।
సిచ్చినయట్టియో। సచ్చరిత్ర! వేగ మేలుకో॥ తెల్ల॥

4. సురదైత్యులబ్ధినిఁ। దరవంగమఠమై మం। దర
పర్వతమునెత్తియూన్। గరుణనిర్జరుల కె। ల్లరకు
నమృతమిడిన। పరమపూరుష! వేగ, మేలుకో॥ తెల్ల॥

5. కిరియై హిరణ్యాక్షు । బరిమార్చి వేగని । ర్జరులె
ల్లరును మెచ్చఁగా । నురుదంష్ట్రముల విశ్వం ।
భరనెత్తివట్టి యో । పరమకృపానిధి! మేలుకో॥
తెల్ల॥

6. నరసింహరూపమై । ధర హేమకశ్యపు । నురముఁ
జీరివధించియు । వరగఁబ్రహ్లాదునిఁ । గరుణతోఁ
గాచిన । నిరుపమ గుణజాల! మేలుకో॥ తెల్ల॥

7. వడుగై మఱి బలిదైత్యు । కడకేగి పుడమి మూ।
డడుగులయాచించి నే । ర్పడరకోదసినిండి । వడిఁ
బాతాళమునకు । నడఁగఁద్రొక్కిన మేటి! మే
లుకో॥ తెల్ల॥

8. ఇరువది యొకమారు । ధరణిలోనున్న భూ ।
వరులసంగరధాత్రిని । పరశువు చేఁబూని । శిర
ముల నఱకిన । పరశు రామావతార! మేలుకో॥
తెల॥

9. ఇనవంశమునఁబుట్టి । యనలాక్షువిల్లుఁద్రుంచి ।
జనకాత్మజకుఁబతివై । పనివడి దశకంధ । రుని
మస్తకంబులఁ।దునిమిన శ్రీరామ! మేలుకో॥ తెల్ల॥

10. దితిసుతభామల । వ్రతభంగమొనరించి । యతి
మోదమునఁబార్వతీ । పతికిఁ బృపత్కమై ।
క్షితిలోఁపిలచినబుద్ధ । శ్రితజనపాలక మేలుకో॥
తెల్ల॥

11. ధరణీభారముమాన్ప । కొడుకు వసుదేవునకు ।
పరమప్రీతిజనించియు । దురితాత్ములనుఁద్రుంచి ।
గరిమమీరగభక్త । వరులగాచినకృష్ణా! మేలు
కో॥ తెల్ల॥

12. ఇల వర్ణాశ్రమధర్మ। ములు లేకదురిత సం । కుల
మౌ నత్తరిజూచియున్ । జలమొప్పవచ్చి భూ ।
స్తలితిరుగతద్ధర్మ। ముల స్థాపించెను కల్కి! మేలు
కో॥ తెల్ల॥

13. జగములఁ బాలింపఁ బగలెల్లఁదిరుగఁ గ। లిగినబడ
లికచేతనా। మగుడ మగుడఁ బ్రార్థిం । పగనైన
లేవవు । అగణితవైభవ! మేలుకో॥ తెల్ల॥

14. ధరభట్లపెనుమర్తి । పురమునవెలసియు । శరణు
జొచ్చినభక్తులన్ । దురితశూన్యులఁజేసి । నరగఁ
బ్రోచెదనంచు।బిరుదుగల్గినస్వామి! మేలుకో॥ తెల్ల

15. వాలాయమును ఘంట । శాలవాన్యఁడు ఘంట ।
శాల వేంకటరమణయాఖ్యుని। నేలుబృందావన ।
ఖేల! భక్తపాల । జాలమేల యింతమేలుకో॥ తెల్ల॥

మంగళహారతి.

'మంగళహారతి । మారసుభాంగా' అనుమాదిరిమట్టు

మంగళహారతి । మాధవగొనుమా॥ పల్లవి॥

1. మునిజనపాల । మోహనలీల ।
సుగుణవిశాల । సురరిపుకాల॥ మం॥
2. పరమవిహార । భక్తమందార ।
నందకుమారా । నవనీతచోర॥ మం॥
3. నీరజనేత్ర । నీరదగాత్ర ।
పరమపవిత్ర । భవ్యచరిత్ర॥ మం॥
4. మణిమయభూష । మంజులభాష ।
లాలితహాస । పాలితదాస॥ మం॥
5. పంకజచరణ । భవోదధితరణ ।
వేంకటరమణ । సంకటహారణ॥ మం॥

మంగళహారతి.

మంగళంబిదె కొను । మ్యా, రమావరా॥ పల్లవి॥

1. ముచికుంద నందిత । మునిబృంద వందిత॥ మం॥

2. క్షీరాబ్ధి మందిర । జితమార సుందర॥ మం॥
3. భక్తామర ద్రుమ । భవతిమిర చంద్రమ॥ మం॥
4. వేంకటరమణ । సంకటహరణ॥ మం॥

## మంగళహారతి.

'మంగళం దయాంతరంగ । రంగనాథతే । రవికులప్రియ'

అనుమాదిరి పట్టు

మంగళం బహీంద్రశయన । సంగరహిత సా ।
రంగనయన॥ పల్లవి॥

భవతిమిరార్యమ! కృపాస్య । భావా! సుగు ।
ణావాస!ర । మావామా । మణివిహార ॥ మంగ
ళం॥ ఉపపల్లవి॥

1. అండజరాడ్గమ! యదుకుల! మందన! యఖిలాండ
కోట్య । బాండపతి! సురారిశిరః । ఖండన!యా ।
ఖండలనుత । భండన! వే । దండవరద॥ మం॥

2. పంకజనయనా! ముకుంద । సంకటహర । ఘంట
శాల । వేంకటరమణార్చితపద । పంకజా! శంకర
నుత । శంకర భక్తవశంకర॥ మం॥

# మంగళహారతి.

రఘువీరా । రణధీర । రారా సాకేతధామవిహారా॥

అనుమాదిరి.

వరశీలా । సురపాలా । వరదా! హారతిగొనుమా॥

పల్లవి॥

శరణాగతభక్తరక్ష । ధరణీసురకల్పవృక్ష॥ వర॥

గిరీశ చాపవిభంగా । కరధృతశంఖరథాంగా ।
దురితభుజగవిహంగా । చరణగంగ మోహ
నాంగ॥ వర॥

ఘోరాసురదర్పహరణ । కుంజరదుఃఖనివారణ ।
స్వర్ణాక్షప్రవిదారణ । సరసీరుహ నిభచరణ ।
సంసృతి శరనిధితరణా । సన్నుత సర్వాభరణా ।
భక్తహృదబ్జభ్రమణా । పాలితవేంకటరమణా ॥
వర॥

సంపూర్ణము.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

